# పల్స్ పోలియో
# జాతీయ కార్యక్రమము

రచన :


## డా॥ కర్రా రమేష్ రెడ్డి

M.D., D.C.H., L.M.C. (IMA)
C.C.P.N (U.S.A.)
పిల్లల వైద్య నిపుణుడు
సికిందరాబాద్



ప్రచురణ




**HYDERABAD NURSING HOME PVT. LTD.**
B1. Basheerbagh Palace, Hyderabad - 500 029.

# *PULSE POLIO NATIONAL PROGRAMME*



*First Edition :* November, 1997

*Copies :* 5000

Publihser :
**Dr. V. Rajeshwar**
M.S.
Director
Hyderabad Nursing Home

*Price Rs :*

---

*Printed at :* **Sri Lakshmi Offset Printers**
Musheerabad, Hyderabad. Ph : 7639059

# పల్స్ పోలియో

గ్రామ ఆరోగ్య కార్యకర్త లక్ష్మి గ్రామంలో ఉన్న ఒక సంవత్సరం వయస్సులోపు పిల్లలందరూ క్రమం తప్పకుండా టీకాలు వేయించుకొన్నారో లేదో తెలుసుకొనే పనిమీద వివరాలు సేకరిస్తూ గౌరి ఇంటికి వచ్చింది.

బయట ఆకు కూరలు కొంటున్న గౌరి లక్ష్మిని చూడగానే నవ్వుతూ

"ఏం లక్ష్మీ బాగున్నావా? ఇంట్లోకిరా మళ్ళీ ఏం వార్తలు మోసుకొచ్చావు మా పాప కోసం?"అంది ఉత్సాహంగా.

"పోలియో వ్యాధి గురించి, దానిని నివారించే విధానం గురించి నీకు చెప్పడానికి వచ్చాను గౌరి" అంటూ చాపమీద కూర్చుంది లక్ష్మి.

"ఈ మధ్య రేడియో, టీవీలో కూడా పోలియో గురించి ఎక్కువగా వస్తున్నదే!"

"ఔను గౌరీ 2000 సం॥నాటికి ప్రపంచ వ్యాప్తంగా పోలియో వ్యాధిని పూర్తిగా నిర్మూలించాలని ప్రపంచ ఆరోగ్య సంస్థ నిర్ణయించింది. అందువల్లనే ఈ ప్రచారమంతా"

"పోలియో అంత భయంకరమైన వ్యాధా?" ఆశ్చర్యంగా అడిగింది గౌరి.

"పోలియో వ్యాధి రాకుండా పోలియో చుక్కలు వేయించకపోతే, జన్మించిన 200 మంది శిశువులలో ఒకరు పోలియో వ్యాధివల్ల శ్వాశత అంగవైకల్యం పాలౌతారు."

"అంటే?"

"పోలియో వల్ల కాళ్ళు చేతులు శాశ్వతంగా పనిచేయక చచ్చుబడిపోవడం, కొన్నిసార్లు వ్యాధితీవ్రంగా ఉన్నప్పుడు గాలి పీల్చలేక పిల్లలు మరణించవచ్చు"



"ఈ వ్యాధి పిల్లలకు ఎలా వస్తుంది.?"

"ఇది వైరస్ అనే సూక్ష్మజీవి వల్ల వస్తుంది. వైరస్ కలుషితమైన ఆహారం, నీరు ద్వారా నోటి నుండి పిల్లల ప్రేగులలోకి ప్రవేశించి నాడీ వ్యవస్థకు చేరుకొని అక్కడి కణాలను నాశనం చేస్తుంది"

"ఈ వ్యాధి లక్షణాలు ఏమిటి?"

"వ్యాధి మొదటి దశలో వైరస్ సూక్ష్మక్రిములు ప్రేవులలో పెరుగుతూ ఉంటాయి. ఈ సమయంలో వ్యాధి లక్షణాలేవీ కనిపించవు.

రెండవదశలో రోగ నిరోధక శక్తి లేనివారిలో వైరస్‌లు శరీరమంతా ప్రవేశిస్తాయి. అప్పుడు జ్వరం, తలనొప్పి, గొంతునొప్పి, వాంతులు, కడుపునొప్పి వచ్చి మూడు నాలుగు రోజులుంటాయి.

మూడవ దశలో వైరస్‌లు నాడీ వ్యవస్థలో కొన్ని భాగాలను నాశనం చేయడం వల్ల మెడ, నడుము, కాళ్ళనొప్పులు చాలా అరుదుగా కాళ్ళు, చేతులు, శ్వాస కండరాలు, మెడ కండరాలు, పనిచేయక చచ్చుబడి పోతాయి".

"ఇదిగో ఈ పుస్తకంలోని పటం చూడు. పోలియో వ్యాధివల్ల చచ్చుబడి పోయిన కాళ్ళు. చేతులు ఏవిధంగా సన్నగా, వంకరపోయి ఉన్నాయో. వ్యాధి తీవ్రంగా ఉంటే కర్ర సహాయంతో నడవడం లేదా కాళ్ళు, చేతులతో ప్రాకాల్సి వస్తుంది.



“ఈ వ్యాధి రాకుండా ఏం చేయాలి?”

“టీకాలు వేయించడమే ప్రధానం. పోలియో చుక్కలు బిడ్డకు 6 వారాల వయస్సులో ఒకసారి, 10 వారాల వయస్సులో రెండవసారి, 14వారాల వయస్సులో మూడవసారి వేయించాలి. మరల 16 నెలలు 24 నెలల మధ్య ఒకసారి వేయించాలి.”

“ఈ మధ్య పల్స్ పోలియో అంటున్నారు. దాని సంగతేమిటి?”

“ఈ రోజు నీ దగ్గరికి వచ్చింది ముఖ్యంగా ఆ పనిమీదే గౌరీ.”

“మరైతే చెప్పు. ఇంకా ఆలస్యందేనికి” అంటూ గౌరి కూడా లక్ష్మి పక్కనే కూర్చుంది.

“ఇంతకు ముందు వేయించిన 4 సార్లకు అదనంగా మరొక రెండుసార్లు పోలియో చుక్కలు కనీసం నెలరోజుల వ్యత్యాసంతో ఇవ్వాలి”

“ఎలా ఇస్తారు? ఇది సూదిమందా?”

“కాదు, కాదు... నోట్లో రెండు చుక్కలు వేస్తారు”.



"పల్స్ పోలియో ఏ వయస్సు పిల్లలకు ఇప్పించాలి?"

"5 సంవత్సరాల వయుస్సులోపు పిల్లలందరికీ వేయించాలి?"

"ఏ రోజైనా వేయించవచ్చా?" అడిగింది గౌరి.

"కాదు. దేశమంతా పిల్లలందరికీ ఒకేరోజు వేస్తారు. అందువల్లనే దానిని "పల్స్ పోలియో" అన్నారు. ఉదాహరణకు పోయిన సంవత్సరం మొదటగా డిసెంబర్ 7 1996, రెండోసారి 18 జనవరి 1997లో వేసారు.'

"మరి ఈసారి ఎప్పుడు వేస్తారు?"

"మొదటిసారి డిసెంబరు 7 1997, రెండోసారి జనవరి 18 1998 లో ఇస్తారు."

"5 సం॥లు పూర్తికాని వారికే ఎందుకు వేయించాలి.

పిల్లలందరికీ వేయించవచ్చుగదా!"

"పోలియో వ్యాధి ఎక్కువగా 5 సం॥లలోపు వారికే వస్తుంది."

"పోలియో చుక్కలు వేయడానికి ముందు తల్లిపాలు తాగించ వచ్చా?"

"వేయించడానికి ముందుగాని, వేయించిన తరువాత గాని ఏ పాలైనా త్రాగించవచ్చు. దీనివల్ల టీకా పనిచేయకుండా పోతుందను కోవడం పొరపాటు".

"పోలియో చుక్కలు ఎక్కడవేస్తారు?"

"వీటిని మనం ఎన్నికల సమయంలో ఓటువేసే పోలింగ్ కేంద్రాలలో, కమ్యూనిటీ భవనాలలో, ఆరోగ్య కేంద్రాలలో వేస్తారు."

"ఒకవేళ ఆరోజు ఏదైనా ప్రయాణం చేయాల్సివస్తే?"

"ఇలాంటి వారికోసం బస్‌డిపోలు, రైల్వేస్టేషన్లు, విమానాశ్రయా లలో కూడా పల్స్ పోలియో కేంద్రాలు ఏర్పాటు చేస్తారు."

“కేంద్రాలు ఏ సమయంలో తెరిచి ఉంచుతారు?”

“ఉదయం 7 గం॥ల నుండి సాయంకాలం 6 గం॥ల వరకు మీకు ఎప్పుడు పనితీరితే అప్పుడు వెళ్ళవచ్చు. అదేరోజు ప్రైవేటు ఆసుపత్రులలో కూడా వేస్తారు. మీకు దగ్గరగా ఎక్కడ అనుకూలంగా ఉంటే అక్కడ వేయించుకోవచ్చు”.

“ఆరోజు పిల్లలకు ఏదైనా అనారోగ్యం చేస్తేనో?”

“దగ్గు, జలుబు, విరేచనాలు, జ్వరం ఉన్నా కూడా పోలియో చుక్కలు వేయించాలి.”

“5 సం॥లలోపు పిల్లలు ఏదైనా తీవ్ర అనారోగ్యంతో ఆసుపత్రిలో ఉంటే.”

“అలాంటి వారికి కూడా పల్స్ పోలియో మందు ఆసుపత్రి అధికారులు ఏర్పాటు చేస్తారు.”

“పోలియో చుక్కలు వేయించడంవల్ల దగ్గు, జలుబు ఇంకా ఏమైనా సమస్యలు రావచ్చా?”

“పోలియో చుక్కలవల్ల ఎలాంటి అసౌకర్యం, అనారోగ్యం ఏర్పడదు. పోలియో చుక్కలు వేసిన తరువాత

వచ్చిన దగ్గుతో పోలియో చుక్కలకు సంబంధం ఏమీ ఉండదు. ఆ దగ్గు ఆ సమయంలో పోలియో వేచియించకపోయినా సహజంగా బాక్టీరియా, వైరస్‌ల వల్ల వచ్చి ఉండేది."

'పల్స్ పోలియో వేయిస్తే ఇంకే జబ్బులు రావంటావా?'

"ఇది కేవలం పోలియో వ్యాధి నివారణకోసం మాత్రమే. దానితో ఇతర వ్యాధుల నుండి పిల్లలను రక్షించలేము. అందువల్ల శిశు సంరక్షణ, వ్యాధుల నివారణ కోసం తీసుకోవాల్సిన మిగతా చర్యలన్నీ ఎప్పటివలెనే తీసుకోవాలి. ఏ మాత్రం అజాగ్రత్తగా ఉండకూడదు."

"ఇలా ప్రతి సంవత్సరం పోలియో చుక్కలు వేయించాలా లక్ష్మీ?"

"అవును బిడ్డకు 5 సం॥లు నిండేవరకు ప్రతి సంవత్సరం ఈ మందు ఇప్పించాలి."

"డిపిటితో పాటు పోలియో చుక్కలు వేయించిన తరువాత కూడా ఇవి అవసరం అంటావా లక్ష్మీ?"

"తప్పకుండా వేయించాలి. ఇవి అదనం. ఇందులో అనుమానానికి ఏ మాత్రం అవకాశంలేదు."

"పల్స్ పోలియో ఏవిధంగా పనిచేస్తుంది?"

"నోట్లోవేసే చుక్కల్లోని వ్యాధి కలిగించలేని వైరస్ సూక్ష్మజీవి శరీరంలో నివాసం ఉండి, వ్యాధి కలిగించే వైరస్ చేరకుండా అడ్డు పడుతుంది."

"ఇంతకు ముందు టీకాలు తీసుకున్న వారికి కూడా ఈ పల్స్ పోలియో ఎందుకు వేయించాలి?"

"టీకాలు క్రమం తప్పకుండా తీసుకొన్నప్పటికీ కొందరి ప్రేవులలో ఇంకా వ్యాధికారక వైరస్‌లు ఉండి ఇతరులకు సోకవచ్చు. ఈ ప్రమాదాన్ని నివారించడానికే 5 సం॥లలోపు పిల్లలందరికీ ఇప్పించాలి."

"పల్స్ పోలియో ఇవ్వాల్సిన సమయంలోనే నెల నెలా టీకా ఇప్పించాల్సి ఉంటే ఏం చేయాలి?"

"నెలనెలా వేయించాల్సిన టీకాలన్ని అదే క్రమంలో వేయించాలి. ఆ క్రమం తప్పకూడదు. పల్స్ పోలియో, నెలనెలా టీకాలకు మధ్య వ్యత్యాసం నెల రోజులు లేకున్నప్పటికీ ఇప్పించాలి."

"పల్స్ పోలియో డిసెంబర్, జనవరి నెలలలోనే ఎందుకు వేయించాలి.?"

"ఈ నెలలలో వ్యాధికారక వైరస్‌ల సంఖ్య వాతావరణం లో తక్కువ కాబట్టి టీకా ద్వారా శరీరంలో ప్రవేశించిన వ్యాధి రాకుండా కాపాడే వైరస్‌లు ప్రేవులలో స్థిరనివాసం సుళువుగా ఏర్పరచుకోగలవు."

"పల్స్ పోలియో కార్యక్రమముతో పోలియో వ్యాధి నిర్మూలన సాధ్యమేనంటావా లక్ష్మీ?"

"కేవలం ఈ కార్యక్రమం ద్వారా పోలియో వ్యాధిని నివారించలేము. ఈ కార్యక్రమంతో పాటు పరిసరాల పరిశుభ్రత, జీవన స్థాయి పెరుగుదల వల్ల పోలియో వ్యాధిని నివారించవచ్చు "

"ఇలా ఎక్కడైనా జరిగిందంటావా లక్ష్మీ?"

"ప్రపంచంలోని 145 దేశాలలో ఇలాంటి వివిధ కార్యక్రమాల ద్వారా ఇప్పటికే పోలియో వ్యాధి నివారించ గలిగారు. అలాంటి అనుమానాలకు అవకాశమే లేదు. మన దేశంలోనే గతంలో మశూచి వ్యాధిని నిర్మూలించగలిగాము.

గత రెండు సంవత్సరాలుగా పల్స్ పోలియో కార్యక్రమాన్ని దేశ వ్యాప్తంగా నిర్వహించగలిగాముగా గౌరి."

"కొందరు పిల్లలకు పోలియో చుక్కలు వేయించి నప్పటికీ పోలియో వ్యాధి వచ్చినట్టు విన్నాను నిజమేనా?"

"చాలా అరుదుగా ఇలా జరుగవచ్చు. దానికి కారణం ఆ పిల్లలకు వేసిన చుక్కలు పనిచేయకపోవచ్చు. పోలియో చుక్కల మందు తయారు చేసినప్పటి నుండి పిల్లలకు ఇచ్చే వరకు - 20°C ఉష్ణోగ్రత వద్దనే ఉంచాలి. ఎక్కువ ఉష్ణోగ్రతల వద్ద వుంచితే ఈ చుక్కల మందు పనిచేయదు. పూర్తి డోసులు అంటే 6, 10, 14 వారాలకు, బూస్టర్ 16–24 నెలల మధ్య వేయించక పోవడం మరొక కారణం."

"మీరు చెప్పిన దానివల్ల నాకు ఈ కార్యక్రమంలో పూర్తిగా నమ్మకం కలిగింది లక్ష్మి. మరి దీనికోసం నేను ఏ విధంగా సహాయ పడగలను."

"1. మీ పాపకు పల్స్ పోలియో వేయించడం.

2. మీ చుట్టు ప్రక్కల, బంధువులకు, మిత్రులకు ఈ కార్యక్రమము గురించి తెలియజేయడం.

---

3. మీ వీధిలో ఉండే 5 సం॥లలోపు వయస్సు పిల్లల వివరాలు సేకరించి వాటిని టీకా కేంద్రం వారికి ఇవ్వడం."

"ఈ వ్యాధి నివారణ కోసం ఇంకా తీసుకోవాల్సిన జాగ్రత్తలేమైనా ఉన్నాయా?"

"ప్రతి చిన్న అనారోగ్యానికి కూడా ఇంజెక్షన్లు చేయించుకొనే దురలవాటు మానుకోవాలి.

మీ చుట్టుపక్కలోని పిల్లలకు ఎవరికైనా అకస్మాత్తుగా కాళ్ళు లేదా చేతులు పనిచేయక చచ్చుబడిపోతే వెంటనే మీ దగ్గరలో ఉన్న ఆరోగ్య కేంద్రంలో తెలియజేయాలి. వారు పోలియోనో కాదో నిర్ణయించి ప్రభుత్వానికి తెలియ బరచాలి."

"చాలా విషయాలు చెప్పావు లక్ష్మి కృతజ్ఞతలు" అంటూ లేచింది గౌరి.

తను కూడా లేస్తూ "ప్రభుత్వం కల్పించిన ఈ అవకాశాన్ని మన మందరం సద్వినియోగం చేసుకొని 2000 సం॥ నాటికి

పోలియో వ్యాధిని ప్రపంచ వ్యాప్తంగా నిర్మూలించడానికి కలిసికట్టుగా కృషి చేయాలి." అంటూ బయటికి నడిచింది లక్ష్మి.



★ ప్రపంచవ్యాప్తంగా ఉన్న పోలియో బాధితులలో 60% పైగా మన దేశంలోనే ఉన్నారు.

★ పల్స్ పోలియో కార్యక్రమ ఫలితాలు.

| *సం॥* | *పోలియో కేసుల సంఖ్య* |
|---|---|
| 1995 | 3,263 |
| 1996 | 1,005 |
| 1997 (3నెలలు) | 60 |

★ వచ్చే కొద్ది సంవత్సరాలు కూడా డిసెంబర్ 7, జనవరి 18 తేదీలలోనే పల్స్ పోలియో చుక్కలు వేయించాలి.

ఈ పుస్తక ప్రచురణలో సహకరించిన

డా॥ ఎ. పి. రంగారావు

డా॥ కె. గోపాల రావు

డా॥ జి. వెంకట రెడ్డి

డా॥ పి. నాగ భూషణం

డా॥ బి. రవి బాబు

డా॥ జె. వెంకటేశ్వర రెడ్డి

గార్లకు నా కృతజ్ఞతలు

★ ★ ★

ఈ పుస్తకం చదివిన తరువాత మీకు పల్స్ పోలియో గురించి ఇంకా ఏమైనా సందేహాలుంటే తెలియజేయండి.

డా॥ కర్రా రమేష్ రెడ్డి
M.D., D.C.H., L.M.C. (IMA)
C.C.P.N (U.S.A.)
ఇ.నెం. 6-1-287/ఎ,
పద్మరావ్‌నగర్, సికిందరాబాద్

దేశ వ్యాప్తంగా

**డిసెంబర్ 7 1997, జనవరి 18 1998న**

**ఉదయం 7 గం॥ నుండి సాయంకాలం 6 గం॥ వరకు**

పల్స్ పోలియో కార్యక్రమము రోజు

5 సం॥ల లోపు పిల్లలందరికి

పోలియో చుక్కలు వేయించండి.

• • • • •

రెండుసార్లు

తప్పకుండా వేయించండి.

---

# కుటుంబ సంక్షేమ శాఖ

**ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం.**